# చైనాలో
# నూతన జీవితోద్యమం



రచన :

జనరలిస్సిమొ ఛియాంగ్ కై షేక్

ఆంగ్లానువాదం :

ఛియాంగ్ కై షేక్ సతి

ఆంధ్రీకరణం :

శశి

సంస్కృతి గ్రంథమండలి,

వంగల్ బిల్డింగ్స్. :: :: పెరంబూరు పోస్టు,

మద్రాసు.

ప్రచురణ—5
వెల నాలుగణాలు

ప్రథమ ముద్రణం,
ఆగస్టు 1943

---

సంపాదకులు :
కస్తూరి సూర్యప్రకాశరావు,
కొత్తపల్లి సుబ్బరామయ్య, ఎం. ఏ., ఎల్. టి.,

మేనేజరు :
వంగల్ గోవిందస్వామి రెడ్డి

---



ఛియాంగ్ కై షేక్ దంపతులు

# తొలి పలుకు

1911లో చైనాను పరిపాలించుచుండిన మంచూ కుటుంబాన్ని అధికారం నుంచి తొలగించడంతో చైనాలో విప్లవం ప్రారంభమైంది. ఈ విప్లవంనుంచి బయట పడడానికి చైనా ఎంతో ప్రయత్నించింది. ఈ ప్రయత్నానికి అడ్డంకులు రెండేర్పడినవి. రాజకీయ జీవితానికీ, బాధ్యతలకూ ప్రజలు సంసిద్ధులై ఉండక పోవడం మొదటిది. తరతరాలుగా అలవాట్లోవున్న దురాచారాలు రెండవదిన్నీ.

ప్రభుత్వ విషయాల్లో తమకేవిధమైన జోక్యంలేదని చైనాప్రజలు కొన్ని వందల సంవత్సరాలుగా దూరంగా నుంచబడ్డారు. దేశంయొక్క పరిపాలనా బాధ్యతా—హక్కులూ కేవలం ఉద్యోగవర్గం సొంతసొమ్మని ఉరిశిక్షలను అనుభవించడం మూలంగాగూడా ప్రజలు తెలుసుకోవలసి వచ్చింది.

తత్ఫలితంగా, పరిపాలకుల కోర్కెలను అనుసరించి, శతాబ్దాల తరబడిని ప్రజలు ప్రభుత్వ విధానంలో ఏలాంటి ఆసక్తిలేక జాతీయ విషయాలంటే నిరసన భావాన్ని పూనారు. ప్రజల ఆసక్తి వారి కుటుంబం, వారి తెగకు సంబంధించిన విషయాలతో తృప్తినొందేది. పౌరసత్వమును గురించిగాని, దాని బాధ్యతలను గురించిగాని వారెరుగరు: ఎరుగదలచుకొనలేదు. దేశభక్తి ఆవశ్యకతలను, దేశం పట్ల, లేక దేశపతాకంపట్ల ప్రజలకుండవలసిన భక్తిని గురించిగాని వారెరుగరు.

బలవంతంవలన ఏర్పడిన ఇలాంటి సందర్భాల్లో ఇతర దేశాలలో అగపడని కొన్ని ప్రత్యేక స్వభావాలుగల అలవాట్లకు చైనాప్రజలు లోనయ్యారు. అందువలన రాజకీయద్వారం తెరువబడేటప్పటికి ఈ వాకిలినుంచి వచ్చిన స్వాతంత్ర్య కాంతికి వారి కండ్లు భ్రమిసి మూతపడ్డవి. వందల సంవత్సరాలు చీకటిలోనున్న వారు ఒక్కమారు వెలుతురును చూచేటప్పటికి వారి కండ్లు భ్రమిసిపోవడం సహజం. రాజకీయ జీవితాన్నిగాని, అధికార జీవితాన్నిగాని ప్రజలు అర్థంచేసుకోలేక పోయారు. సర్వ సామాన్యమైన విద్యావిధానం లేనందున బెదరిపోయారు.

శతాబ్దాలపర్యంతం ప్రభుత్వంతో సంపర్కంలేకపోవడం బాహ్యప్రపంచంతో అట్టే సంబంధంలేని ఏదో కొద్దిపాటి దేశంలోనయితే చెల్లేదిగాని చైనావంటి గొప్ప దేశంలో, ప్రపంచంలో మరేదేశంలోనులేని 45 కోట్ల జనాభాగల దేశంలో, ఈ సంపర్కం లేకపోవడం చాల చెడుగా పరిణమించింది.

పరిస్థితులు అతివేగంగా నడుస్తూవుంటవి. వాటికేమాత్రం దయా, దాక్షిణ్యం లేదు. సోమరిపోతులువచ్చి అందుకొనువరకు అవి ఆగవు. అందువలన, శతాబ్దాలపర్యంతం జాతీయ భావాన్ని, ఉత్సాహాన్ని అణచివేసినందున ఏర్పడిన అవినీతికరమైన ప్రాబల్యాన్ని రూపుమాపడం అత్యవసరమని, అందుకు తగిన నిశ్చిత కార్యక్రమానికి పూనుకోడం చైనా సమస్య నెరిగినవారి బాధ్యత.

ఒక నూతన జాతీయ చైతన్యాన్ని, ప్రజాబాహుళ్యమానసిక తత్వాన్ని సృష్టించి, అభివృద్ధి పరచవలసి వచ్చింది. ఈ ఉద్దేశంతోనే "నూతన జీవితోద్యమం" అని పిలువబడుచున్న ఉద్యమం ప్రారంభింపబడినది.

ఇతరదేశాల ప్రజలు ఇలాంటి ఉద్యమం ఎందువలన అవసరమో మొదట్లో గ్రహించలేరు. వారు జాతీయ చైతన్యతతో, జాతీయ చైతన్యం నడుమ పెరిగినందున ఈ విషయాన్ని సులభంగా గ్రహించలేకపోతున్నారని గుర్తుంచుకోవాలి. చైనా ప్రజలు బలవంతంమీద తమ జాతీయతకు, దేశీయతకు దూరంగా నుంచబడ్డారని, తమ దేశస్థితి, గతులను గురించి పాశ్చాత్యులు పొందుచున్న ఉద్రేక, ఉత్సాహాలూ, వారి కార్యదీక్ష, చైనా ప్రజలు కొన్ని శతాబ్దాలుగా మరచిపోయారని విదేశీయులు గ్రహించాలి. ఈ విపరీత పరిస్థితులవలన కలిగిన దుస్థితిని రూపుమాపను నేడు మానసికంగాను, విద్యామూలంగాను తగినచర్య తీసుకొనబడుతూన్నది.



# 1. నూతన జీవితోద్యమ ప్రాధాన్యము

శతాబ్దాల పర్యంతం ఏర్పడిన అలవాట్లను మార్చడం, మాన్పడం చాలా కష్టమైనవిషయం. కాని కొన్ని శక్తివంతమైన అలవాట్లను కొత్తగా ప్రారంభించి ఉపయోగించడంద్వారా సకాలంలో ప్రజలదృష్టి మార్పు చెందుతుందని, ఈ నూతన కాలానికి, ఈ నూతన జీవితానికి అవసరమైనట్లు ప్రజలు ఉత్సాహంతోను, నేర్పరితనంతోను ప్రవర్తిస్తారని మన ఆశ. అందువలన ఈ నూతన జీవితోద్యమం యొక్క ఆశయం చైనా సాంఘిక పునరుద్ధరణమే.

ఈ ఆశయాన్ని సాధించను ప్రజలదృష్టి చైనా జాతియొక్క పురాతన నీతులపట్ల మరలింపబడుతూంది. ఈ నీతులు "మర్యాద", "న్యాయబుద్ధి", "నీతి", "మనస్సాక్షి" అనునవి. వీటిని మనభాషలో "లి", "ఐ", "లియన్", "చిహ" అని అంటున్నాం. పూర్వం చైనాప్రజలచేత ఈ నాలుగునీతులు ఎక్కువగా గౌరవింపబడుచు వచ్చినవి. చైనాజాతి పునరుద్ధరింపబడవలెనన్న ఈ నాలుగు నీతులూ నేడు అత్యవసరమై యున్నవి.

5,000 సంవత్సరాల సంస్కృతిని, చరిత్రను చైనా కలిగివుంది. ప్రజల దైనందిన జీవితానికి మార్గదర్శకులైన మహనీయుల ఉదాహరణలనేకం ఆ చరిత్రలోనున్నవి. నిర్లక్ష్యత, హింస కారణంగా ఈ జీవిత సన్మార్గాలు అదృశ్యమైనవి. వీటి స్థానంలో మొరటుతనమూ, అసభ్యతా ఏర్పడినవి.

చైనా విస్తీర్ణం 18,96,500 చదరపుమైళ్లు. మనదేశం కావలసినంత సహజ సంపత్తిని కలిగివుంది. ప్రస్తుతపు క్షీణతకూ, అభివృద్ధిలేక పోవుదానికీ కారణం పై చెప్పబడ్డ (ప్రజలు అవలంబించవలసిన) నీతులు నిర్లక్ష్యంగా చూడబడ్డమే.

మన ప్రజలసంఖ్య 40,00,00,000 లకు మించుతుంది, కాని మనం పై నీతులను అభ్యసింపకపోయినందున మనదేశంలో సాంఘికవ్యవస్థ తారుమారైంది. మన ప్రజలలో హెచ్చుమంది వారనుభవించవలసిన జీవితానికన్న నికృష్టజీవితాన్ననుభవిస్తున్నారు.

కనుక, వ్యక్తిగత జాతీయపు లోటుబాట్లను సరిపరచను పూర్వీకుల ఉపదేశాల అందచేరవలెనని మనం నేర్చుకోవాలి. మొరటుదనం, అసభ్యతాయుతమైన అలవాట్లూ సాంస్కృతిక, కళా సంబంధమైన తరిబియత్తులవలన మార్చు చెందుతవి. క్షీణతను వ్యక్తిగత సత్ప్రవర్తనవలన అరికట్టవచ్చును. కాని కేవలం సాధారణవిద్య, ప్రభుత్వవిధానాలమూలంగా ఈ మార్పును సాధించడం కష్టం. మార్పును తీసుకొనిరాను మనం ధృఢనిశ్చయంతోనున్న ప్రధాన ప్రశ్నతో కార్యక్రమాన్ని ప్రారంభించాలి—మన అలవాట్లను మార్చుకోగలమా? మన అలవాట్లను మార్చను నూతన జీవితోద్యమం అత్యవసరం. మనజాతి విముక్తికి ఈ ఉద్యమం కీలకంగా భావింపబడుతూంది.

# 2. నూతన జీవితోద్యమ వివరణ

## (అ.) జీవితమంటే ఏమి?

"ప్రజల జీవితంలో వారి జీవనాధారము, సంఘంయొక్క ఉనికి, జాతియొక్క క్షేమం, జనబాహుళ్యంయొక్క జీవితం ఇమిడి ఉన్నవి"—అని డాక్టర్. సన్ యెట్ సెన్ అన్నాడు. ప్రజలజీవితం ఈవిధంగా నాలుగు భాగాలు చేయబడినప్పటికి జీవనాధారం మిగిలిన మూడింటి ప్రతిబింబం మాత్రమే. ఉనికి, రక్షణ మీద ఆధారపడి ఉంటుంది. క్షేమానికి అభివృద్ధి అవసరం. జీవితంపుట్టుకలను కోరుతుంది. ఈ అవసరాలన్నిటిని సంతృప్తిపరచను మనం చురుకుగా నుండాలి, పనిచేయాలి. జీవితమంటే చురుకుగానుండి, పనిచేస్తూండడంతప్ప వేరుగాదు.

## (ఆ.) నూతన జీవితమంటే యేమి ?

సంతతిని అభివృద్ధిపరచవలెనన్న కోర్కెను సంతృప్తిపరచనూ, మానవుల జీవితాన్ని కాపాడనూ, జాతీయ క్షేమాన్ని అభివృద్ధిపరచనూ చేయబడు ప్రయత్నాలన్నీ పరిస్థితులనుబట్టి మార్పుచెందుతవి. కాలం నిలకడగా నిలువదు. పరిస్థితులు కాలాని కనుగుణంగా మార్పునొందుతవి. కనుక రోజురోజుకూ నూతన పరిస్థితుల కనువైనట్లు తమ్మతాము మార్చుకొనగలవారే సక్రమంగా జీవించగలరు. ప్రజలయొక్క జీవితం ఈ మార్పును పొందుచున్నప్పుడు వ్యక్తి తన లోటు

పాట్లను తాను సరిదిద్దుకోవాలి. నిరుపయోగమైన శక్తులను వదలివేయాలి. అప్పుడు ఆ జీవితాన్ని నూతన జీవితమని పిలుస్తాం.

(ఇ.) నూతన జీవితోద్యమమంటే యేమి ?

ఒక ప్రజల నూతన జీవిత అవసరాలను తీర్చను, కొంతవరకు, మనం ప్రభుత్వంమీద ఆధారపడాలి. ముఖ్యంగా ఆ ప్రభుత్వ విద్యావిధానం, ఆర్థిక తంత్రం ప్రజలందరి క్షేమాన్ని ఏపాటి భద్రపరచగలవు ? అన్న సమస్యలపై ఆధారపడాలి. ఒక ప్రభుత్వంయొక్క ఎత్తుగడలు జయప్రదంగా సాగింపబడుతున్న విషయం అప్పటి ప్రజల అలవాట్లు, ఆచారాలమీద ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. నూతన విధానం తన పునాదులను అప్పట్లోనున్న సాంఘిక ఆచారాల మీద నిర్మింపకున్న, పాతజీవిత విధానం విచ్ఛిన్నమై నూతనజీవిత విధానం పొడ చూపేటప్పుడు, నూతన ప్రయత్నాలకు కొంత కష్టం కలుగుతుంది. అందువలన నూతన ప్రయత్నాలకు ప్రజలనుండి ప్రోద్బలాన్ని కోరేముందు కొత్త పరిస్థితులకు తగినట్లు తాము మార్పుచెందాలని ప్రజలకు బోధించడానికి తగిన ఉద్యమాన్ని ప్రారంభించడం అత్యవసరం—ప్రథమ కర్తవ్యమునూ. "నీరు ఎల్లప్పుడు తడీ గల తావులనే ప్రవహిస్తుంది: అగ్ని పొడిగానున్న చోట్లకల్లా వెళ్తుంది." వీటికి తడిగల తావుల నేర్పాటుచేయడం, నిప్పుకు పొడిగానున్న తావుల నేర్పాటుచే యడం ఈ సాంఘికోద్యమం యొక్క కర్తవ్యం. తాను మార్పుచెందుచున్న కాలంలో ప్రతిజాతి, నూతన కార్యక్రమానికన్నా తన ఆచారాలనూ, అలవాట్లనూ మార్చన్కు ఎందువలన ఎక్కువ శ్రద్ధవహించుచున్నది విశదమౌతుంది. ఈ సాంఘికోద్యమాల విజయం నిజంలో ప్రభుత్వ నూతన కార్యక్రమంయొక్క విజయమన్నమాటే. మన నూతన జీవితోద్యమ ఆవశ్యకతను ఈ విషయమే చక్కగా నిరూపించు తూంది. ఈ ఉద్యమం దీని ఆవశ్యకతను బాగుగా నెరిగినవారితో ప్రారంభమై క్రమేణా ఇతరులకు వ్యాపించాలి. దగ్గరనున్న వారినుంచి చాల దూరాననున్న వారికి, దాని సామాన్య రూపాలనుండి అతి చిక్కైన స్వరూపాలకు వ్యాపించాలి. వ్యక్తి తనంతటతాను ఈ కొత్త అలవాట్లను అభ్యసించగలిగిన ఆతని కుటుంబం లోని మిగిలినవారు ఆతనినిచూచి నేర్చుకొనవచ్చును. ఒక కుటుంబం సంఘా న్నంతటిని ప్రేరేపించవచ్చు. ఒక సాంఘికోద్యమం రాజకీయాలు, విద్యతో

చేతులుకలిపిపే ముందుకు నడుస్తూంది. వాటిపై ఆధారపడుటకు బదులు ఎల్లప్పుడూ సాంఘికోద్యమం—రాజకీయాలు, విద్యకన్నా ముందే నడుస్తూంటుంది.

# 3. నూతన జీవితోద్యమ ఉద్దేశం

(అ.) నూతనజీవిత మెందువలన అవసరమైనది ?

మన ప్రజల నేటి సాధారణ మనస్తత్వాన్ని ఒక్క—మాటతో వర్ణించవచ్చు—నిరుత్సాహత. మంచి చెడుగుల వ్యత్యాసాన్ని పాటించకపోవడం; ప్రజల సొమ్ముకూ, వ్యక్తుల సొమ్ముకూగల వ్యత్యాసాన్ని గ్రహించకపోవడం; ప్రాధాన్యమైనదానికీ, తాత్కా—లికమైనదానికీగల భేదాన్ని చూడకపోవడం నేడు మన ప్రజల ప్రవర్తనలో ప్రత్యక్షంగా కనబడుచున్న విషయాలు. మంచి, చెడుగుల వ్యత్యాసం గుర్తింపబడక పోవడంచేత తప్పు, ఒప్పులు తారుమారు చేయబడుచున్నవి. ప్రజలదనీ, వ్యక్తులదనీ, వ్యత్యాసం పాటించ బడనందున ఇవ్వడానికి, పుచ్చుకోడానికితగ్గమార్గము లేకుండాపోయింది. ప్రధాన విషయాలకూ తాత్కా—లిక విషయాలకూగల వ్యత్యాసాన్ని గుర్తింపక పోవడంవలన ఏది మొదట ? ఏది కడావట ? అని నిర్ణయించడంలో పొరబాటు జరుగుతూన్నది. వీటన్నిటికీ ఫలితంగా అధికారులు దగాకోరులుగాను, అత్యాశాపరులుగాను అగుతూన్నారు. ప్రజాబాహుళ్యం శిక్షణలేక మొద్దుబారిపోయింది. వయోజనులు అజ్ఞానులుగాను, దుర్మార్గులుగాను ఉన్నారు. యువకులు హీనులౌతూన్నారు: మితిమీరిపోతున్నారు. ధనికులు భోగలాలసులౌతున్నారు: అతివ్యయులౌతున్నారు. పేదలు క్రమతలేని నీచులౌతున్నారు. సహజంగా, ఈ పరిస్థితుల ఫలితంగా సాంఘికవ్యవస్థ, జాతీయ జీవితం పూర్తిగా విచ్ఛిన్నం కావడం తటస్థించింది. కనుకనే, సహజమైన విపత్తులనూ, మన దేశంలో నేర్పడుచున్న ముప్పులనూ, మన దేశంమీదికి వచ్చుచున్న దండయాత్రలనూ ఆపడానికిగాని, లేక వాటికి లొంగిపోక నిలబడడానికిగాని తగినస్థితిలోలేము. వ్యక్తి, సంఘం, దేశం అంతాగూడా నేడు బాధపడుచున్నవి. ఇట్టి నికృష్ట పరిస్థితులలో జీవితయాత్రను సాగించడంకూడ కష్టతరమే. అందువలన ఈ నికృష్ట పరిస్థితులను తొలగించి నూతన, జ్ఞానయుతమైన జీవితాన్ని అనుభవించను ఆరంభించడం అవసరం.

(ఆ.) ఎందువలన నూతన జీవితోద్యమం అవసరమైంది?

ప్రజల జీవిత వ్యయపరిమితిని అభివృద్ధిపరచనూ, నూతన సంఘాన్ని సృష్టించనూ ప్రభుత్వం, విద్యావిధానాలమీద ఆధారపడక తప్పదు. దురదృష్ట వశాత్తు ఇంతవరకు ప్రభుత్వం, విద్యావిధానంగూడ వ్యర్థముగా నుండినవి. ఇందుకు కారణం వీటిని నడిపినవారు కపటులు కావడమే. తత్ఫలితంగా న్యాయశాస్త్రం తన విధిని పోగొట్టుకుంది. సాంకేతిక జ్ఞానం ఉపయోగంలోకి రాలేదు. యంత్రము లైనా చురుకుగా పనిచేసినవికావు. ఇతర ప్రజలు తాము ఇట్టి పరిస్థితులలో నున్న ప్పుడు వేరువిధంగా శ్రమపడ్డారు. అందుకు కారణమేమిటి? మనము వారు ఉపయో గించిన యంత్రాలనే, వారుపయోగించిన సాంకేతిక జ్ఞానాన్నే ఉపయోగిస్తున్నాము. కాని ఆ ఫలితాలను ఎందువల్ల తేలేకున్నాము? న్యాయశాస్త్రంగాని, యంత్రాలుగాని చక్కగా పనిచేయడం వాటిమీద ఆధారపడిలేదు. వాటిని ఉపయోగించే మానవుల మీద ఆధారపడివుంది. ఇందుకు కీలకం మానవునిచేతిలోవుంది. కొద్దికాలంలో వ్యక్తి గత ప్రవర్తనను చాలావరకు మార్పుచేయగల శక్తులలో నొకటి సాంఘికోద్యమం. మరేమార్గాన్ని, రాజకీయమార్గాన్నికాని, విద్యాసంబంధమైన మార్గాన్నికాని దానితో సరిపోల్చను వీలులేదు. "రాజకీయాలు, విద్యా, వాటికర్తవ్యాన్ని నెరవేర్చ వలసి ఉన్నవి" అన్నమాట నిజమే. వాటి బాధ్యతలను ఇచ్చట విశదీకరించ వలసిన అవసరంలేదు. ప్రస్తుతం మన జాతికి కలిగిన క్లిష్టదశవంటి సందర్భా లలో, మనం చావును ఎదురుచూస్తూ చేతులు జోడించుకొని నిలబడడానికి నిశ్చ యించుకుంటే మన సంఘాన్ని, ఎన్నటికో పరిణావస్థ ననుసరించి సంఘం బాగు పడుతుందిలే అని ఊరుకొనక, వెనువెంటనే, పునర్నిర్మించాలి——అసాధారణమైన మార్గాల పునర్నిర్మించాలి. అంటే, మన సంఘంలో ప్రస్తుతంవున్న నికృష్ట పరి స్థితులను ఒక్కమారు ఉప్పెన తుడిచివేసినట్లు తుడిచివేయాలి; మలయమారుతం వీచునట్లు, సౌమనస్యంతో, సమాజానికి ఉత్సాహాన్ని, వీర్యాన్నీ సమకూర్చాలి అంటే నూతన జీవితోద్యమానికి సామాన్య కార్యాలుగావూ.

## 4. నూతన జీవితోద్యమంలోని విషయాలు

(అ.) నూతన జీవితోద్యమ సిద్ధాంతాలు.

పైె చెప్పబడిన నాలుగు నీతులను మార్గదర్శకాలుగా నుంచుకొని క్రమ జీవితాన్ని ప్రజల కలవరచను నూతన జీవితోద్యమం ప్రయత్నిస్తూంది. కూడు,

బట్ట, ఇల్లు, పని మొదలైన సామాన్య విషయాలను, ఈ నీతుల కనువైనట్లు అన్వ యించాలి. దేశంలో నీతిని స్థాపించను పై నాలుగు నీతులు అత్యవసరం. అవే సిద్ధాంతాలు. ఈ నియమములనుండి వ్యక్తులతో, విషయాలతో ఎలా ప్రవర్తించడ మని, తన ప్రవర్తనెలా అభివృద్ధి పరచుకోడమని, తన నడవడిని సందర్భాలకు తగినట్లు ఎలా మార్చుకోడమని వ్యక్తి నేర్చుకుంటాడు. ఈ నియమాల నతిక్ర మించినవా రెవరైనాసరే అపజయంపొందక తప్పదు. వీటిని నిర్లక్ష్యంగాచూచే జాతి ఏదిగాని చాలాకాలం నిలువదు.

సందేహపరులు రెండురకాలవారున్నారు.

1. ఈ నాలుగునీతులు కేవలం సత్ప్రవర్తనకైన నియమాలని కొందరి అభిప్రాయం. ఈ నీతులు ఎంత మంచివిగా నున్నాసరే వాటినుంచి జాతికి ఏపాటి లాభమూ కలుగదు. (జాతి ఉపయోగించే సాంకేతికత, జ్ఞానం, తదితర జాతుల కన్నా హీనమైయున్నా.) ఈ అభిప్రాయాన్ని గలవారు ప్రధానవిషయాలకు, అప్ర ధానమైనవాటికిగల భేదాన్ని అర్థంచేసుకోలేరు. సాంఘిక, జాతీయ దృష్టినిబట్టి దేశవిముక్తికొరకు నీతిపరులైన వారుమాత్రమే తమ జ్ఞానాన్ని, సాంకేతికతను యెక్కువగా ఉపయోగించగలవారు. నీతిపరులుగానివారు తమ సమర్థతను అవి నీతికరమైన పనులకు ఉపయోగిస్తారు. మర్యాదా, న్యాయబుద్ధీ, నీతీ, మనస్సాక్షీ— ఈ నాలుగు ముఖ్యనిబంధనలు సమాజానికి, ముఠాకు, జాతికంతటికీగూడా వర్తి స్తవి. ఈ నిబంధనలప్రకారం నడుచుకొననివారు, బహుశా, వారి జ్ఞానాన్ని, సమర్థ తను సంఘానికి నష్టదాయకమయ్యేట్లు ఉపయోగించవచ్చు. కనుక, ఈ నీతులు ఒక జాతియొక్క పునాదులను ధృఢంగా నిర్మించడంలో అత్యంత ప్రాధాన్యమైన విగా భావింపబడవచ్చు.

2. ఈ నీతులు కేవలం మెరుగుపెట్టబడిన వాంఛనాలని, దైనందిన జీవిత అవసరాలతో వీటికే సంబంధంలేదని వాదించే మరోరకం ప్రజలున్నారు. వారొక ఉదాహరణ విస్తున్నారు. ఆకలి గొనియున్నవానికి ఈ వాంఛనాలు అన్నంబెట్టునా? అని వారిప్రశ్న. ఈ కొంటె ప్రశ్నలు కుఅన్–ట్జి మహత్తర బోధనలను అపార్థం చేసుకున్న ఫలితం కావచ్చు—"ఒకడు తన కూటికి, బట్టకు దిగులుపడవలసిన అవసరం లేనప్పుడు తన స్వగౌరవాన్ని పాటించును. వడ్లపాతర నిండియున్న ప్పుడు ప్రజలు మంచి వాడుకలను నేర్చుకుంటారు." వ్యక్తికి తాను మానవుడుగా

నుండడమెలాగు అని ఈ నాలుగు నీతులు బోధిస్తవన్న విషయాన్ని సందేహ పరుడు గ్రహించలేకుండా ఉన్నాడు. ఈ నీతులను ఎరుగనివారికి కావలసినంత కూడూ, బట్టా ఉన్ననూ ఉపయోగమేముంది? పైగా, కులన్-ట్జి ఒక ప్రత్యేక కాలంలో, ఒక ప్రత్యేక విషయానికి సంబంధించిన దానినిగురించి చెప్పాడుగాని సర్వకాల, సర్వావస్థలందు వర్తించే న్యాయాన్ని చాటలేదు. అతను విశాలభావా లను వెలువరచినప్పుడు "మర్యాదా, న్యాయబుద్ధీ, నీతి, మనస్సాక్షి జాతియొక్క నాలుగు స్తంభాలు" అని అన్నాడు. ఈ నీతులు ఆ చరణలో వున్నప్పుడు కూడూ, బట్టా తాత్కాలికంగా చాలకయున్నను మానవశక్తి వాటిని కావలసినంత ఉత్పత్తి చేయగలదు. వట్ల పాతరలు ఖాళీగావున్న మానవప్రయత్నం మూలంగా వాటిని నింప వచ్చు. అట్లుగాక, ఈ నీతులు పాటింపబడనప్పుడు కష్టకాలంలో, వస్తువులు చాలని రోజుల్లో దొంగతనం, బిచ్చమెత్తడం సహజంగా వ్యాపిస్తవి. సాంఘిక దృష్టిలో దొంగతనం, బిచ్చమెత్తడం ఏకార్యాన్నీ ఎన్నడూ సాధించలేవు. సాంఘిక క్రమత ఈ నీతులపై నాధారపడివుంది. క్రమత ఏర్పడివున్నప్పుడు ప్రతివిషయం చక్కగా సాగింపబడవచ్చు. కాని ప్రతివిషయం గందరగోళంలో వున్నప్పుడు ఏపాటిని సాధింపలేము. ప్రపంచంలోని అత్యధిక ధనసంపన్నమైన నగరాల్లోనే ఈనాడు, సామాన్యంగా, ఎక్కువ దొంగలూ, బిచ్చగాండ్రునూ ఉన్నారు. ఈ నీతుల నాచరించ లేకపోవడంవలన కలిగే భీభత్సానికి ఈ ఒక్క నిదర్శనం చాలదు? మనదేశం దేశద్రోహులను, కమ్యూనిస్టులను, లంచ గొండ్లైన అధికారులను కలిగియున్నదన్న సత్యం, మనంగూడ ఈ నీతుల నాచరించక నిర్లక్ష్యంగా వున్నామని ఋజువుపరుస్తూంది. మనం తెప్పరిలుకోవలె నంటే ఈ నీతులు నూతన జీవిత సిద్ధాంతాలుగా అవలంబింపబడాలి.

(ఆ.) "మర్యాద", "న్యాయబుద్ధి", "నీతి", "మనస్సాక్షి"—వీటికర్థం.

ఎల్లప్పుడు మర్యాదా, న్యాయబుద్ధీ, నీతి, మనస్సాక్షి జాతికి మూలాధారాలని నమ్మబడుతూన్ననూ కాలానుగుణ్యంగా నేటి పరిస్థితులను మార్చను ఈ సిద్ధాంతా లకు నూతన వ్యాఖ్యానాన్ని ఇవ్వడం అవసరం కావచ్చు. వ్యావహారిక దృష్టితో నేడు ఈ నీతులను మనం క్రిందివిధంగా విశదీకరించవచ్చు—

"మర్యాద" అంటే హృదయం, బుద్ధికూడ క్రమమైన దృష్టినికలిగి ఉండడం.

"న్యాయబుద్ధి" అంటే అన్ని విషయాలలోను సత్ప్రవర్తన.

"నీతి" అంటే వ్యక్తిగత జీవితంలోను, అధికార జీవితంలోను, సాంఘిక జీవితంలోను నిజాయితీనీ, విచక్షణను కలిగుండడం.

"మనస్సాక్షి" అంటే తన్నుతాను ఎరిగి ఉండడం. పరువూ, ప్రతిష్ఠా, సత్యసంధతా కలిగి ఉండడం.

"మర్యాద" అన్న పదానికర్థ వివేకము లేక జ్ఞానము అని అనవచ్చు. ప్రకృతికి సంబంధించినప్పుడు ప్రకృతిన్యాయం అవుతుంది. సాంఘిక విషయాలకు అన్వయింపబడినప్పుడు నియమము లేక నిబంధన అవుతుంది. జాతీయ విషయాలకు అన్వయించినప్పుడు హద్దు, అణకువలను తెలియజేస్తుంది. వ్యక్తి యొక్క జీవితంలోని ఈ మూడు అవస్థలుగూడా వివేకంవల్లనే చక్కబడతవి. అందువల్ల బుద్ధి, మనస్సుల క్రమపరచబడ్డ దృష్టిని "మర్యాద" అనవచ్చు.

"న్యాయబుద్ధి" అంటే సరియైన నడవడి అని అర్థం. ప్రకృతిన్యాయాన్ని, సాంఘిక కట్టుబాట్లను, జాతీయ క్రమతను అనుసరించిన ప్రవర్తనలన్నీగూడ సరియైన ప్రవర్తన లేనని అనాలి. ఏ చర్యగాని సరియైనది కానప్పుడు, లేక ఒక వ్యక్తి తలంపులు సరియైన మార్గాన నుండియుండి ఆతడు తన తలంపుల ననుసరించి నడచుకొననప్పుడు అట్టి ప్రవర్తనను, సహజంగా, అక్రమ ప్రవర్తన అని అనాలి. అట్టి ప్రవర్తనగలవారు "న్యాయబుద్ధి"ని కలిగివున్నారనికాని, వారి ప్రవర్తన సరియైనదనిగాని అనను వీలులేదు.

"నీతి" అన్న పదానికర్థం నిర్మలమనీ, లేక స్పష్టమనీ. నీతి తప్పు, ఒప్పులకుగల వ్యత్యాసాన్ని చూపుతుంది. "మర్యాద", "న్యాయబుద్ధి"—ఈ రెంటిని బట్టి నడిచే నడవడికలన్నీ ఒప్పైన ప్రవర్తనలగును. వాటికి అనుగుణ్యంగా లేని ప్రవర్తనలన్నీ తప్పైనవి. మనం ఒప్పుగా భావించే వానినిమాత్రమే గ్రహించి, తప్పని భావించేవాని నన్నిటినీ త్రోసి పుచ్చడం విచక్షణ అనబడుతూంది. విచక్షణయే నీతి.

"మనస్సాక్షి" అంటే తన్నుతా నెరిగివుండడం. వ్యక్తి తన ప్రవర్తన "మర్యాద", "న్యాయబుద్ధి", "నీతి" ననుసరించి లేదని తానెరిగియున్నప్పుడు తన నడవడినిచూచి తనకే సిగ్గువేస్తుంది. తన నడవడికి తానే అవమానపడును.

ఇతరులు తప్పుత్రోవల తొక్కుచున్నారని ఎరిగినప్పుడు మానవుడు వారి ప్రవర్తనలనుచూచి విసుగుజెందుతాడు. కాని అతడు బాగును బలపరచనూ, ఓగును వదలివేయనూ ప్రయత్నించడానికి వీలయ్యేటట్లు అతను తన్నుతా నెరగడం నిజమై యుండాలి. పరిపూర్తి నొందాలి. అట్టి మనశ్శక్తినే మనం మనస్సాక్షి అంటాము.

మనస్సాక్షి మన చేతలను, భావాలను నడిపిస్తుందని, నీతి దానికి దారి చూపుతుందని, న్యాయబుద్ధి మనంచేసే ప్రతి పనికీ సంబంధించినదనీ, మర్యాద మనంచేసే ప్రతి పనియొక్క బాహ్యస్వరూపాన్ని నిరూపిస్తుందనీ పై వివరణనుబట్టి విశదమౌతుంది. ఈ నాలుగు పరస్పర సంబంధంకలిగి ఉన్నాయి. ఈ నాలుగు ఒకదానిపై నొకటి ఆధారపడి ఉన్నాయి. న్యాయబుద్ధిలేని మర్యాద మోసంకిందికి తేల్తుంది. నీతిలేని మర్యాద అనవసరమైన దాబుగా పరిణమిస్తుంది. మనస్సాక్షి లేని మర్యాదా పొగడ్తా, ముఖస్తుతీ కాగలవు. ఇవన్నీగూడ పైకి మర్యాదగా కన బడినా నిజంలో మర్యాదమాత్రం కావు. ఇదేవిధంగా మర్యాదలేని న్యాయబుద్ధి అసహ్యాసు వేస్తుంది.—కోపాన్ని పుట్టిస్తుంది. నీతిలేని న్యాయబుద్ధి వ్యర్థమని పిస్తుంది. మనస్సాక్షిలేని న్యాయబుద్ధి విపరీతంగా కనబడుతుంది. ఇవన్నీగూడా న్యాయబుద్ధులు కావన్నమాట. మర్యాదలేనినీతి అబద్ధం, మోసంగాకూడా కనబడు తుంది. న్యాయబుద్ధిలేని నీతి లోభితనమేగాని వేరుగాదు. మనస్సాక్షిలేని నీతి అవినీతిగాని అదినీతిగాదు. ఇదేవిధంగా మర్యాదలేని మనస్సాక్షి గందరగోళంగా పరిణమిస్తుంది. న్యాయబుద్ధిలేని మనస్సాక్షి హింస కిందికితేల్తుంది. నీతిలేని మన స్సాక్షి వికారంగా వుంటుంది. ఇవన్నీ మనస్సాక్షి రూపాలు కాజాలవు.

ఈ నాలుగు నీతులు దూషింపబడినప్పుడు దేశద్రోహులకు, పాపులకు గొప్ప అవకాశం దొరకుతుంది.

## (ఇ.) కూడు, బట్ట, నివాసం, పని—వీటికర్థం.

మన నిత్యజీవితంలో అత్యవసరమైన వస్తువులు రెండున్నాయి. ఒకటి మనకూడు, బట్ట, నివాసం, రాకపోకల వసతులు మొదలైనవానికి సంబంధించిన వస్తుసామగ్రిని తెల్పుతుంది. మరొకటి ఈ పదార్థాలు మనదైనందిన అవసరాల కుపయోగపడునట్లు వానిని ఉపయోగించు విధానమైవుంది. మొదటిది వస్తు సామ

గ్రికిచెందిన ఐహిక విషయం. రెండవది మానవ జీవితంలోని దైవత్వానికి సంబం ధించినదని అనవచ్చు.

మన భాషలో "హిసిన్" అను పదానికి విశాల అర్థాన్నీ, కుంచితమైన అర్థాన్నికూడా ఇవ్వను వీలుంది. ఈ పదానికి కొద్దిపాటి అర్థం నడకా అని. విశాల అర్థం కార్యసాధన అని. మానవుడు తనదైనందిన జీవితంలోచేసే పను లన్నిటినీ ఈ ఒక్కపదంలో ఇముడ్చవచ్చు. "ప్రజల మూడు సిద్ధాంతాలు" అన్న రచనలో డాక్టర్. సన్‌యెట్‌సెన్ కూటినీ, బట్టనూ, నివాసాన్నీ, రాకపోకల వసతు లనూగురించి ఉదహరించినప్పుడు ఆయన ఈ పదాన్నే (హిసిన్) ఉపయోగించాడు. అందులో ఆయన రాకపోకల వసతులకు అన్వయించేటట్లు కొద్దిపాటి అర్థంలో ఈ పదాన్ని ఉపయోగించాడు. తన "జాతీయ పునర్నిర్మాణ సిద్ధాంతాలు" అన్న గ్రంథంలో డాక్టర్. సన్‌యెట్‌సెన్ ఇలా వ్రాశాడు—

"ప్రజలకు కావలసినంత ఆహారపదార్థం లభించడానికి వ్యవసాయాభి వృద్ధిలోనూ, వారికి కావలసిన బట్టను సమకూర్చడానికి నేతపరిశ్రమ నభివృద్ధి పరచడంలోనూ, వారి నివాసాలను నివాసయోగ్యంగా చేయడానికి అన్ని విధము లైన గృహనిర్మాణ కార్యక్రమంలోనూ, వారికి రాకపోకల వసతుల కలిగించ డానికి తత్కార్యక్రమంలోనూ ప్రభుత్వం ప్రజలకు సహకారిగా నిలవ్వాలి."

రాకపోకలను తెలియజేయను ఆయన ఈ "హిసిన్" అన్న పదాన్నే ఉపయోగించాడు. అంటే యీ పదంయొక్క సూక్ష్మార్థంలో ఉపయోగించాడన్న మాట.

(ఈ.) "మర్యాదనూ", "న్యాయబుద్ధినీ", "నీతినీ", "మనస్సాక్షినీ" కూడు, బట్ట, నివాసం, పనీగా అనువర్తింప చేయుట.

ఈ నాలుగు నీతులను కూడు, బట్ట, నివాసం, పనికి అనువర్తింప ప్రయ త్నించెదను.

మన జీవిత ఆధారాలను పోషించడం మూడు తరంగాలుగా భావింపబడ వచ్చు—(1) పదార్థ సంగ్రహణం, (2) వాటిగుణాన్నిబట్టి పదార్థాల నేర్పరచు

కొనడం. (3) ఈపదార్థాల నుపయోగించుకొనురీతి. వీటిని ప్రత్యేకంగా చర్చింతాం.

(1) పదార్థ సంగ్రహణం "నీతి"పై ఆధారపడినది కావాలి. మనది, మనదికాదు అన్న విచక్షణ స్పష్టంగా నుండాలి. ఏ వస్తువులుగాని మనకు చెందనప్పుడు వాటిని మనం అంటనేరాదు. మన నిత్యజీవితానికి కావలసిన పదార్థాలను మనం శ్రమశక్తివలన సంపాదించాలి, లేదా వేరు సక్రమమార్గాలవాటిని గ్రహించాలి. పోట్లాటలకు దోహదమివ్వరాదు. రక్షించకుండా భుజించేవాడు మనకు ఆదర్శపురుషుడు కారాదు. ఇచ్చి, పుచ్చుకోడాల్లోనైనా అక్రమ ముండరాదు. "మనం జాగ్రత్తపుచ్చుకోవలసింది ప్రజలాకలివలన చావకుండాగాదు, తమ మానవత్వాన్ని ప్రజలవమానపరచుకోకుండా జాగ్రత్తపుచ్చుకోవాలి మనం."

(2) పదార్థాలగుణాన్ని నిర్ణయించడంలో మనం "న్యాయబుద్ధి" ననుసరించాలి. ఏ సందర్భంలోగాని ఆ సందర్భానికి తగిన సక్రమమైన కార్యాన్ని చేయాలి. ముసలివారు కావలసినంత విశ్రాంతిని పొందవచ్చు, మాంసం తినవచ్చు. పట్టుబట్టల ధరించవచ్చు. కాని యువకులు కష్టాల కోర్చుకోవాలి. అందుకుతగిన శిరిఫీదును పొందాలి. చలికాలంలో సరియైనది వేసవికి సరిగాజాలదు. ఉత్తరాన సరియైనది దక్షిణమున సరిగాజాలదు. ఒక్క పరిస్థితినే వేరువేరుశక్తులు, వేరువేరువిధాల మార్చుతూన్నవి. ఒక పరిపాలకుడు లేక సైన్యాధిపతి కొంత అధికారాన్ని కలిగుండాలి. అతనికన్న తక్కువ అంతస్థులోనున్న ఉద్యోగులు అంతటి అధికారాన్ని కలిగి ఉండరాదు. కాని వారు క్రమపద్ధతిని గౌరవించాలి. కనుక యుగప్రమాణం, ఋతువూ, స్థలం, అంతస్తూ—ఇవన్నీగూడ కలిసి ఏది క్రమమైనపనో, ఏది క్రమముకాదో నిర్ణయంకావాలి. వేరువేరు పరిస్థితులలో వస్తువుల గుణాన్ని ఏర్పరచడం ఫలితంగా భేదమేర్పడుతూన్నది.

(3) ఈ పదార్థాలను వుపయోగించేరీతి "మర్యాద" అన్న సిద్ధాంతాన్ననుసరించి ఉండాలి. "మర్యాద" అన్న సిద్ధాంతంలో ప్రకృతి న్యాయం, సాంఘిక నిబంధనలూ, జాతీయ క్రమపద్ధతీ—ఇవన్నీగూడ ఇమిడి ఉన్నాయి.

ఈ నాలుగు నీతుల పరస్పరసంబంధాన్ని ఇంతకుముందే చర్చించాం. దైనందిన జీవితానికి అనువర్తింపబడినప్పుడు యీ పరస్పర సంబంధం మరీ

స్పష్టంగా వుంటుంది. అన్ని నీతులు జాగ్రత్తగా ఆచరించబడాలి. వీటిలో ఏ ఒకటి తృణీకరింపబడ్డా మన జీవితంలో మచ్చ ఏర్పడ్డట్లే.

# 5. నూతన జీవితోద్యమ కార్యక్రమం

(అ.) నిర్మాణం.

(1) నూతన జీవితోద్యమ వ్యాప్తికై ఏర్పాటుచేయబడిన నాన్‌ఛంగ్ సంఘంచే యీ ఉద్యమం మొత్తం సాగింపబడాలి. ఇతర రాష్ట్రాల్లో, మునిసిపాలిటీలలో, జిల్లాలలో ఇలాంటి ఉద్యమం ప్రారంభింపబడ్డ ఈ నాన్‌ఛంగ్ సంఘంవంటి సంస్థలు ఏర్పాటు చేయబడవచ్చు. కాని జిల్లాసంఘాలు రాష్ట్రసంఘాల సలహాలప్రకారం నడుచుకోవాలి.

(2) రాష్ట్ర, జిల్లా, మునిసిపల్ సంఘాలు వాటివాటి ఉన్నత అధికారులచే ఏర్పాటుచేయబడి, నడిపింపబడాలి. అచ్చటి స్థానికపార్టీ (కుమింటాంగ్), పౌరసత్వపు సలహా సంస్థ, లేక, సాంఘిక విషయాల గమనించే సంస్థ, విద్యాశాఖ, ప్రజారక్షణశాఖ, స్థానికసైనిక అధికారులు మొదలైనవారు ఈ సంఘంలో పాల్గొనను తమ ప్రతినిధుల నంపాలి. సాంఘిక సభలుగూడ తమ ప్రతినిధులను అంపవచ్చు.

(3) రైతులు గ్రామోద్యోగుల సలహాలను పొందాలి. శ్రామికులు తమ పరిశ్రమల మేనేజరులనుండిగాని, లేక కార్మిక సంఘాలలో బాధ్యతగలవారి నుండిగాని సలహాలనుపొందాలి. వర్తకులు వ్యాపారసంస్థల ధర్మకర్తలనుండి, విద్యార్థులు తమ ఉపాధ్యాయులనుండి, సైనికులు సైన్యంలోని రాజకీయ కార్యదర్శులనుండి, లేక పార్టీ ప్రతినిధులనుండి, ప్రభుత్వోద్యోగులు తమ అధికారులనుండి, స్త్రీలు తమ సంఘాలనుండి సలహాలను పొందాలి. కాని స్థానికసభ ఈ శాఖలన్నిటిపై అధికారిగా నుండాలి.

(ఆ.) ఉద్యమం చేయవలసిన పని.

(1) విచారణ, పరిశోధన.
(2) నిర్ణయం.
(3) కార్యసాధన, అమలుపరచుట.

(ఇ.) ఉద్యమాల ఖర్చులు.

డబ్బు చిక్కనగా వాడబడాలి. ఉద్యమాన్ని ఏర్పాటుచేసే వారినుంచిగాని స్థానిక ప్రభుత్వంనుంచిగాని డబ్బు పోగుచేయబడాలి. ప్రజలనుండి పోగు చేయబడగూడదు.

(ఈ.) ఉద్యమ నిర్వహణ.

ఉద్యమం అంతటికీ అన్వయించే సాధారణ విషయాలను నాన్ ఛంగ్ సభ తీర్మానించాలి. ప్రారంభంలో ఉద్యమం రెండు కార్యాలకు మాత్రమే పూనుకోవాలి—(i) మంచి అలవాట్లు, (ii) పరిశుభ్రత.

(ఉ.) ఉద్యమ సిద్ధాంతాలు.

(1) ఉద్యమం మొదట వ్యక్తితో తనకై ప్రారంభమై క్రమేణా ఇతరులకు వ్యాపించాలి.

(2) మొదట ప్రభుత్వోద్యోగులతో ప్రారంభమై క్రమేణా ప్రజలలో వ్యాపించాలి.

(3) సాధారణ విషయాలతో ప్రారంభమై క్రమేణా ఇతర విషయాలకు వ్యాపించాలి.

(4) సులభమైన, ఖర్చుతక్కువైన విషయాలు ముందు ప్రారంభింపబడాలి.

(5) పాఠశాలలు, కచ్చేరీలు, రైలుస్టేషన్లు, వారధులు, నాటక శాలలు, ఉద్యానవనాలు మొదలైన ప్రజాసంస్థలను ముందు అభివృద్ధిపరచాలి.

(ఊ.) ఉద్యమ మార్గాలు.

(1) మొదట బోధన అయిన పిదప తనిఖీచేయబడాలి. ఉపన్యాసాలు, చిత్రాలు, సాహిత్యం, నాటకాలు, సినిమాలు మూలంగాను, బోధకుల నడవడి ఆదర్శప్రాయంగా నుండడంద్వారాను ప్రజలకు బోధించాలి. అప్పుడప్పుడు సంఘం ఉద్యమవ్యాప్తి ఎలా జరుగుతూవుందని తనికీచేయడానికి తన ఏజంట్లను పంపుతుండాలి. అర్హులైనవారికి బహుమతుల నిస్తుండాలి.

(2) ఈ తనిఖీదారులు మాత్రమే తమకన్న తక్కువ అంతస్థులోనున్న ఉద్యోగుల దైనందిన కార్యక్రమంతో కలుగజేసుకొనను అధికారం కలిగి ఉంటారు. మిత్రులు, శ్రేయోభిలాషులు సలహాలమాత్రమే ఇవ్వగలుగుతారు.

(ఋ.) పని చేయవలసిన కాలం.

వారానికంతమున, సెలవు రోజులలో, తీరిక సమయాలను ఉద్యమ వ్యాప్తికి వినియోగించవచ్చు. వ్యక్తియొక్క నిత్యకృత్యాలకు ఉద్యమ కార్యక్రమం అడ్డు రాకూడదు.

# 6. సమాప్తి

నూతన జీవితోద్యమంయొక్క ముఖ్యోద్దేశం అవివేక జీవితానికి బదులు వివేకజీవితాన్ని నెలకొల్పడం. ఈ మార్పును సాధించను మన దైనందిన జీవితంలో "మర్యాదా", "న్యాయబుద్ధీ", "నీతీ", మనస్సాక్షీ" అన్న నాలుగు నీతులను ఆచరించాలి.

(1) ఈ నీతుల నాచరించడంవలన మన జీవితంలో మొరటుతనం, అసభ్యత మాసిపోతవి. సంస్కృతి, కళలనూ అనుసరించి మన ప్రజల జీవితం ఎక్కువ మెరుగుజెందుతుంది. కళ అంటే ఈనాడు మనలో ధనికులును, పెద్ద మనుష్యులనబడేవారును అనుభవిస్తూన్న ప్రత్యేక ఆనందంకాదు. కళ అన్న పదానికర్థం మన ప్రజలందరి సాంస్కృతిక ప్రమాణం: నాగరికతా, అనాగరికతల మధ్యగల ఎల్ల. పూర్వకాలంలో చైనాప్రజలు ఆరుకళలను—మర్యాద, సంగీతం, ధనుర్విద్య, సారధ్యం, వ్రాయుట, గణితం—ఎరిగి ఉండేవారు. మన పూర్వీకుల నాగరికతను మనం మరచిపోవడం శోచనీయమైన విషయం. తత్ఫలితంగా ఈ ఆరుకళల నిపుణతలో మనం పాశ్చాత్య జాతులకన్నా వెనుకబడివున్నాము. నేటి సాంఘిక పరిస్థితులను చూచి మనలో కళాభ్యాసం కొరతబడియున్నట్లు గ్రహించవచ్చు. అనుమానం, అసూయ, ద్వేషం, పోట్లాటలు మొదలైనవి అనాగరికతకు చిహ్నాలు. వీటిని నాశనంచేయను మనం కళలను హెచ్చుగా అభ్యసించాలి.

(2) ఈ నీతులను అభ్యసించడంవలన మస్త్రెత్తడం, దొంగలించడం నశించిపోతవని, అధికారులు నమ్మకంగాను, దేశభక్తి కలిగి ఉంటారనీ, లంచ గొండితనం ఆగిపోతుందనీ, ప్రజలు యెక్కువగా ఉత్పత్తికి తోడ్పడే కార్యాలకు పూనుకుంటారని ఆశ. మనజాతి పేదరికానికి కారణం అనుభవించేవారికన్నా ఉత్పత్తిచేసేవారు చాల తక్కువమంది ఉండడమే. తత్ఫలితంగా చాలమంది ప్రజలు పరాన్న భోజులుగావున్నారు. ఈ దుర్దశను మార్చను మనం ఈ నాలుగు నీతులను ఆచరించాలి. ప్రజలెక్కువ కష్టపడేటట్లు, తక్కువఖర్చు చేసేటట్లును, అధికారులు నమ్మకంగా నుండేటట్లునూ చేయాలి. పూర్వం మనదేశం "చి", "చౌ" రాజ్యాలను అతి జయప్రదంగా పరిపాలించడానికి కారణం పై రహస్యమే. నేటి ఇటలీ, జర్మనీల అత్యధిక బలానికి మూలకారణంగూడా ఇదే.

(3) ఈ నీతులను ఆచరించడంవల్ల సాంఘిక, అధికార జీవితం నేటి గందరగోళస్థితినుండి ఒక క్రమపద్ధతికి వస్తుందని, ప్రజలెక్కువ సైనికదృష్టిని పొందుతారని ఆశ. ఒక దేశం తన్నుతాను రక్షించుకోలేకపోతే తాను స్వాతంత్ర దేశమై యుండజాలదు. దాని పైశాల్యం ఎక్కువైన కొద్దీ దండయాత్రకులకు దానిపై మోజు ఎక్కువ. జాతీయ విముక్తికి ఒక్కటే ఒక్కమార్గం వున్నది—దేశంయొక్క ఆర్థికస్థిరతను స్థాపించడం, ప్రజల దేశభక్తిని, యోధశక్తిని అభివృద్ధిపరచడం. ఇప్పటికింకా మనదేశంలో కమ్యూనిస్టులు పూర్తిగా అణచివేయబడలేదు. విదేశీయుల దండయాత్రలవలన నానాటికి మనదేశం తగ్గుతూంది. ఈ క్లిష్టతనుండి జయప్రదంగా బయటబడడానికి దేశంలోని ప్రజలను సంతృప్తి పరచాలి. బైటినుంచి మనపైకి వచ్చుచున్న ఆక్రమణల నెదుర్కోవాలి. ఈ కార్యాన్ని చేయను మనం బలం (శక్తి) మీద ఆధారపడాలి. అందుకని మన ప్రజలకు సైనికశిక్షణ నివ్వాలి. అందుకు హంసపాదిగా మనం విధేయతనూ, క్రమతనూ, పరిశుభ్రతనూ, సామాన్యతనూ, మితవ్యయాన్నీ, అవిలంబనమునూ కచ్చితమునూ—మొదలైన అలవాట్లను అలవరచుకోవాలి. మనం క్రమపద్ధతిని నడుచుకోవాలి. నిర్మాణానికి, బాధ్యతకూ, విధేయతకూ ఎక్కువ గౌరవమివ్వాలి. ఏక్షణమందైనా దేశంకొరకు చావ సిద్ధంగా నుండాలి.

కళలయందు యెక్కువ తరిఫీదును బొందినప్పుడు మనప్రజలు ఎక్కువ నాగరికులుగా వుంటారు, సున్నితంగాగూడా ఉంటారు. మనమెక్కువ ఉత్పత్తి చేసినప్పుడు యెక్కువ డబ్బును కలిగియుంటాము. ఎక్కువ దేశభక్తి కలిగి వుండి, మేలు తరిఫీదునుబొంది మనల మనం రక్షించుకోను ఎక్కువ సంసిద్ధులమై యున్నప్పుడు హెచ్చు భద్రతలో నుంటాము. ఇట్టి వివేకజీవితం "మర్యాదా", "న్యాయబుద్ధీ", "నీతి", "మనస్సాక్షి" అన్న పునాదులమీద నిర్మించబడివుంది. ఈ నాలుగు నీతులు కూడు, బట్ట, నివాసం, పని అన్న అవసరాంకు అనువర్తింపబడవచ్చు. మన మీ నీతుల నలవరచుకున్న మన ప్రజల నిత్యజీవితంలో విప్లవం తేగలుగుతాము. అప్పుడు మన జాతికి దృఢమైన పునాదులను మనం నిర్మించినట్లే.



*Printed for the Cultural Book Club, Vangal Buildings, Perambur, Madras by Vinodan Press, 33, Jones Street, MADRAS. G. T.*

# మా ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సోవియట్ల దేశం | ... | ... | 0 8 0 |
| 2 | ఫ్రాన్సు పతనం | ... | ... | 0 8 0 |
| 3 | నేటి జపాన్ | ... | ... | 0 8 0 |
| 4 | సోవియట్ రష్యా | ... | ... | 0 12 0 |
| 5 | చైనాలో నూతన జీవితోద్యమం | ... | ... | 0 4 0 |
| 6 | బోల్షివిజం | ... | ... | 0 4 0 |

# వెలువడనున్నవి

7 సోవియట్ సంయుక్తరాష్ట్రం—మన మిత్రరాజ్యం
రచన: డి. యన్. ప్రిట్.

8 సోవియట్ల దేశం
[రెండవ భాగం]

9 పాకిస్థాన్
రచన: జవహర్‌లాల్ నెహ్రూ.

10 మన ఆర్థికదుస్థితి
అనువాదం: ఎరబర్ల శ్రీరామమూర్తి.

We are very thankful to the Director, Chinese Ministry of Information, Calcutta for granting us the necessary permission to publish this Book — *The New Life Movement in China.* The Original was written by Generalissimo Chiang Kai Shek. It was translated by Madame Chiang Kai Shek into English and was published in Calcutta in 1942. This Telugu version is a rendering of the English One.

August 24,
1943

Editor,
CULTURAL BOOK CLUB,
Perambur, P. O. Madras.